REGD No. NEL 15    ESTD 1930    15-2-1991    శుక్రవారం    రు. 1.50 లు

# జమీన్‌రైతు



సంపుటి: 63    సంచిక: 7    స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు    మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి    సంపాదకుడు : నెల్లూరు డోలేంద్రప్రసాద్

### తుఫాన్ టెండర్ల రద్దుతో ప్రతిపక్షాలే ముఖ్యమంత్రిని

# సెబాష్ అంటున్నాయి

కాంగ్రెస్ ముఖ్యమంత్రి ఎవరూ కలలో కూడా ఊహించని మన్ననను శ్రీ జనార్దన రెడ్డి పొందారు. తన ప్రభుత్వ నిర్వహణపై ప్రతిపక్షాలనుండి సెబాష్ అన్న సర్టిఫికేట్ పొందారు. అధికారంలో వున్న నాయకుల్ని, అందునా కాంగ్రెస్ ముఖ్యమంత్రిని ప్రతిపక్షాలు మంచిమాటలతో ప్రస్తావించడమే అరుదైన సమయంలో, వారి మెప్పును కూడగొనగలగడం ఆశ్చర్యపడాల్సిన విషయమేకదా!

ప్రపంచ బ్యాంకు నిధులతో చేపట్టనున్న తుఫాను నిర్మాణపనులకు కాంట్రాక్టర్లు 200 నుంచి 300 శాతం అదనపు రేట్లతో టెండర్లు వేశారట. అంటే కోట్ల రూపాయలతో జరగాల్సినపనులకు మూడు కోట్లు ఖర్చు పెట్టాల్సివస్తుంది. ఇదివరకటి కాంగ్రెస్ ముఖ్యమంత్రులైతే ఆ కాంట్రాక్టర్లను పిలిపించి, బేరం కుదుర్చుకొని టెండర్లు ఖాయపరిచేసేవారు. అయితే జనార్దన రెడ్డిగారు మాత్రం ప్రతిపక్ష నాయకులను పిలిచి, పరిస్థితి వివరించి, సంప్రదించి,



కాంగ్రెస్ పాలనకు కొత్త వరవడి దిద్దుతున్నారు!

అధిక రేట్లకు వచ్చిన టెండర్లన్నింటినీ రద్దు చేయించేశారు. తన ప్రభుత్వం ఎంత నిజాయితీగా వ్యవహరిస్తుందో ప్రపంచానికి చాటదలచిన జనార్దనరెడ్డి ఈ టెండర్ల వ్యవహారాన్ని చక్కగా వాడుకున్నారు.

ఎమ్ సెట్ పరీక్షల నిర్వహణ విషయంలో కూడా ముఖ్యమంత్రి ఇటువంటి ఆదర్శప్రాయమైన నీతే అవలంబించినట్లు తెలుస్తున్నది. ఎంట్రన్స్ పరీక్షను ఏప్రెల్ 17 తేది జరపబోతున్నట్లు ప్రకటించారాయన. కోచింగ్ సెంటర్ల నడుములు విరిగే ప్రకటన అది.

ఏప్రెల్ 16 తేదివరకు ఇంటర్మీడియెట్ పరీక్షలు జరుగుతాయి. 17 తేది ఎంట్రన్స్ పరీక్ష. అందువల్ల ప్రత్యేక కోచింగ్‌కు వ్యవధిలేదు. సాధారణంగా ఈ రెండింటికీ మధ్య ఒకటిన్నరనెల ఎడం వుండేది. అందువల్ల కోచింగ్ సెంటర్ల నిర్వాహకులు షార్ట్‌టర్మ్ క్లాసులునడిపి, విద్యార్థులనుంచి కోట్లాది రూపాయలు దండుకొనేవారు.



గాంధీమహాత్ముడికి తెలుగుదేశ సభ్యత్వ ప్రదానం చేసినట్లు, పసుపురంగు మయంగా నిర్మితమైన నూతన గాంధీవిగ్రహం, మండపం. (వార్త 8 పేజీలో)

రెండూ ఒకే సమయంతో పెట్టడంవల్ల వారి వ్యాపారం దెబ్బతినబోతుంది. ఈ విషయంతో వారు పెద్దపెద్ద మూటలు చేత పట్టుకొని హైదరాబాద్ రైలెక్కారట. పరీక్ష వాయిదాకోసం. కాని జనార్దనరెడ్డి దగ్గర ఆపప్పులేమీవుడకలేదు. ఆమూటలనే తలదిండులుగా మార్చుకొని, తిరుగు ప్రయాణం పట్టాల్సివచ్చింది.

కాంగ్రెస్ ప్రభుత్వంలో కాసులు కదిలిస్తే ఏ పనైనా అలాగ్గా జరిగిపోతుందనే నానుడితో హైదరాబాద్‌కు వస్తున్న వివిధ వర్గాలప్రజలకు జనార్దనరెడ్డి పరిపాలనతో వచ్చిన మార్పు మింగుడుపడటంలేదు.

—కొరవ 7 వ పేజీలో

# వర్ధమానసమాజానికి గోపాలరెడ్డి అభ్యుదయరూపంతెచ్చారు

కవిత్రయ జయంతులను ఈ సంవత్సరం డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు కొత్త మలుపుత్రిప్పారు; వాటికి కొత్త రూపం ఇచ్చారు. వర్ధమాన సమాజం 1916 లో తిక్కనజయంతిని ఏటాజరపడం ప్రారంభించింది; ఆ కార్యక్రమ 1928లో తిక్కవరపు రామిరెడ్డిగారు స్వీకరించి, తిక్కన జయంతిలో ఏటా ఒక కవిని రూ 116 లతో సత్కరించడం మొదలు పెట్టారు; రామిరెడ్డిగారే తిక్కనజయంతిని 1958లో కవిత్రయ జయంతులుగామార్చి, నన్నయ—యర్రన్న—తిక్కనల పేర మూడు వేర్వేరు సభలలో ముగ్గురు కవి పండితులచేత ఉపన్యాసాలిప్పించి, ముగ్గురినీ సన్మానిస్తూవచ్చారు. రామిరెడ్డిగారు ఈ కవిత్రయ జయంతులు తన తదనంతరం కూడా శాశ్వతంగాజరగాలనే వుద్దేశ్యంతో, దానికి ఒక ప్రత్యేక నిధినిఏర్పరచి, ట్రస్టును నియమించారు. అప్పటినుండి కవిత్రయ జయంతులు-కవిత్రయజయంతుల ట్రస్టు, వర్ధమాన సమాజం సంయుక్త యాజమాన్యంలో యథారీతి జరుగుతున్నాయి.

ముప్పయిమూడేళ్ళుగా కొనసాగుతున్న ఆ సాంప్రదాయానికి గోపాలరెడ్డిగారు ఈ సంవత్సరం స్వస్తిచెప్పారు. ఈ స్వస్తి గతఏడే పాక్షికంగా ప్రారంభమైంది 9 తేది కవిత్రయ జయంతుల తొలిరోజు ఆయన తన అధ్యక్షప్రసంగంలో "కవిత్రయం తెలుగువారందరికీ ఆద్యులైన కవిగురువులు. గురుపూజగా వారిని సన్మరించుకుంటూ వారి కృతులను చర్చించుకోవడం జరుగుతుంది. ఈ జయంతులకు వేదిక వర్ధమాన సమాజం. ఆసంస్థ పేరుకుతగినట్లు సమాజంలో అభ్యుదయం రావాలి; కవిత్రయం పైనే ఉపన్యసించాలనే నిర్బంధం పెట్టకో కూడదు. నేటినుండి సన్మానాన్ని కవిత్రయ అవార్డుగా పేర్కొంటూ, ఉపన్యాస స్వేచ్ఛను సన్మానగ్రహీతల కిస్తూ తీర్మానించాం" అన్నారు శ్రీ గోపాలరెడ్డి. ఈ సంవత్సరం సన్మాన గ్రహీతలు ముగ్గురూ పిహెచ్ డి. లు కావడం ముదావహమని ఆయన సంతోషాన్ని వ్యక్తంచేశారు. కవిత్రయ జయంతులను అక్షరోత్సవాలుగా శ్రీ గోపాలరెడ్డి అభివర్ణించారు.

### కొత్తమలుపు తిరిగిన కవిత్రయ జయంత్యుత్సవాలు

వర్ధమానసమాజం అనేపేరు అనాదిగా వుండేదేగాని అది ఎప్పుడు ఆకస్మాత్తుగా తనకుతాను అభ్యుదయరూపాన్ని పొందలేదు. గోపాలరెడ్డిగారే అభ్యుదయవాది అయిపోయారు సాహితీరంగంలో ఆయన దృక్పథంలో, భావంలో ఆమార్పు కనపడుతుంది. ఆయనలోవచ్చినమార్పే కవిత్రయ జయంతులకు సంబంధించి వర్ధమాన సమాజంమీద పడింది! గోపాలరెడ్డి అభిప్రాయానికి అనుగుణంగానే నన్నయజయంతిలో కందుకూరి రుద్రకవి రచనలపై ఉపన్యసించి అనంతపురం ఆకాశవాణి డైరెక్టరు డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావు; ఎర్రన జయంతిలో కందుకూరి వీరేశలింగంసాంఘికసంస్కరణోద్యమాలనుగురించి ప్రసంగించి, విజయవాడ - మాంటిస్సోరి విద్యాసంస్థల వ్యవస్థాపక నిర్వాహకురాలు డాక్టర్ వి. కోటీశ్వరమ్మ; తిక్కన జయంతిసభలో నిర్వచనోత్తర రామాయణాన్నిగూర్చి మాట్లాడి, కావలి జవహర్ భారతి తెలుగుశాఖాధిపతి డాక్టర్ వై వి. సుబ్బరాయుడు గోపాలరెడ్డిగారినుండి కవిత్రయ అవార్డులు స్వీకరించారు.

రుద్రకవిని 1490-1560 మధ్యకాలం వాడుగా తాను భావిస్తున్నానని; రుద్రకవి అనగానే ఆయన జనార్దనాష్టకం గుర్తుకు వస్తుందని, "సిరులమించిన పసిడి బంగరు ఊయల దుప్పటి జారగా" అనే పద్యం ప్రజల నాలుకలపై నర్తించినంతకాలం ఆయన రచనలు అజరామరంగా నిలిచిపోతాయని శ్రీ అనంత పద్మనాభరావుగారన్నారు. మనకు లభిస్తున్న రుద్రకవి రచనలు మూడేనని, అవి—నిరంకుశోపాఖ్యా

—కొరవ 8వ పేజీలో

## పినాకినీ తీరం

### గాంధీజీ విగ్రహం- ఎన్టీఆర్ ఆవిష్కరణ

నెల్లూరులోని గాంధీజీ కాంస్యవిగ్రహాన్ని మాజీముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావుగారిచేత ఆవిష్కరింపజేయడం నెల్లూరీయులనే అవమానించడంకాదా! వారి ఆత్మాభిమానాన్ని కించపరచడం కాదా! మునిసిపల్ ఛైర్మన్ శ్రీ రమేష్‌రెడ్డి చేయదగిన, చేయవలసినపనేనా ఇది!

శ్రీ రామారావు ఆవిష్కరణకు అనర్హుడని, ఆయన చేయగూడదని, ఆయనచేత చేయించగూడదనేది నా వుద్దేశ్యం కాదు. ఆయన తెలుగుదేశం వాడని, అందువల్ల ఆయన ఆ పనికి తగినవాడుకాదనేదికూడా నా భావం కాదు. ఛైర్మన్ రమేష్ రెడ్డి రామారావుగారి శిష్యపరమాణువని, భక్తాగ్రేసరుడని, 'తామ్మతవ కాతుక' ని, తెలుగుదేశంవాడని నాకు తెలియకపోలేదు. కాని మూడున్నర దశాబ్దానికి సెంపుగా, తమవాడు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయ్యాడని నెల్లూరీయులు మురిసిపోతున్న సమయంలో ఆయనచేత కాకుండా మరొకరిచేత తెరిపించడం ఏమి భావ్యం అని నా ప్రశ్న. మన మండలీయుడేగాక నేటి ముఖ్యమంత్రిని వదలి, ఒక మాజీ ముఖ్యమంత్రిచేత జరిపించడంలోని ఔచిత్యం ఏమిటి అని నా ప్రశ్న.

ఇది పార్టీ కార్యక్రమమేమీకాదు; మునిసిపాలిటీ ఆధ్వర్యంలో జరుగుతున్న అధికార కార్యక్రమం. విగ్రహం ఒక్కటేకాదు, దాని నిర్మాణాది ప్రారంభోత్సవ కార్యక్రమం వరకు వ్యయం మునిసిపాలిటీదే. అటువంటి అధికార కార్యక్రమానికి అధికారంలో వున్న మనజిల్లా ముఖ్యమంత్రిని పిలిచివుంటే ప్రయోజనకరంగా వుండేది. రమేష్‌రెడ్డి హయాంలో నెల్లూరు మునిసిపాలిటీ ఒక చిన్నపనికూడా చేయలేని ఆర్థిక దుస్థితికి చేరుకున్నది. అభివృద్ధి కార్యక్రమం చేపట్టలేకపోవడమేగాదు, స్కావెంజర్ల వంటి చిన్న నౌకర్లకు సకాలంలో వేతనాలు చెల్లించలేనంతగా దివాలాతీసింది. ఐ. పి. పెట్టలేదనే గాని, ఆ విధంగా చేతులెత్తేసిన సిగ్గుమాలిన పరిస్థితిలోవుంది. ఈ సమయంలో మునిసిపాలిటీకి అన్నివిధాలుగా ప్రభుత్వ అండ అవసరం; ప్రభుత్వం నుండి నిధులుపొందడం అనివార్యం. వానతో మరీ దౌర్భాగ్యస్థితిలోవున్నరోడ్లు బాగుచేయడానికి ముఖ్యమంత్రి ప్రత్యేకంగా నిధులిస్తేతప్ప, మునిసిపాలిటీకి గతి లేకుండాపోయింది. రోడ్ల మరమ్మతులు, పారిశుద్ధ్య కార్యక్రమాలవంటి సాధారణ పనులకేకాకుండా, మార్కెటు, బైపాస్ రోడ్డు, మంచినీటి సరఫరా అభివృద్ధి, అండర్‌గ్రౌండ్ డ్రైనేజి వగైరా అనేక పనులకు ప్రభుత్వనిధులు అవసరమైవున్నాయి. గాంధీజీ విగ్రహ ఆవిష్కరణకే కాదు, ఇతర మునిసిపల్ కార్యక్రమాలకు కూడా, ముఖ్యమంత్రి వంటి అధికారంలో వున్నవారిని ఆహ్వానించి, తమ అవసరాలు నివేదించుకుంటే నిధులుపొందడం ఎంత

—కొరవ 8వ పేజీలో

# జమీన్‌రైతు

## అస్థిరత

దేశ రాజకీయ వాతావరణంలోకి అస్థిరతా పవనాలు మళ్ళీ ప్రవేశిస్తున్నాయి. అవి తుఫాను గాలులుగా రూపాంతరం చెందే ప్రమాదం కన్పిస్తున్నది. అటు కేంద్రంలో, ఇటు రాష్ట్రాలలో ప్రభుత్వాల స్థిరత్వం, మనుగడ దినదినగండం నూరేళ్ళాయుష్షుగా మారిపోతున్నది. జీవితంలో ఒక్కరోజైనా భారత ప్రధాని కావాలన్న చంద్రశేఖర్ వ్యక్తిగత లక్ష్యానికి; రామజన్మభూమి వివాద ఫలితంగా రంగులుమారిన రాజకీయాన్నుంచి తమ పార్టీని రక్షించుకోవాలనే రాజీవ్‌గాంధీ వ్యూహాత్మక నిర్ణయానికి భారత ప్రజలు పెద్దమూల్యమే చెల్లించవలసివస్తోంది.

పదవీకాంక్ష అనేది ఒక్కరోజుతో చల్లారేదికాదు. అందువల్లే చంద్రశేఖర్ తనకు దొరికిన కుర్చీని పదిలంగా కాపాడుకోవడానికి తనకు చేతనైన ప్రయత్నాలన్నీ చేస్తున్నారు. ఏ సభలోనూ సభ్యత్వం లేని ఐదుగురు మంత్రులను తన క్యాబినెట్‌లో వుంచుకోవడానికికూడా ఆయన సందేహించడంలేదు. తనకు అదృష్టం పట్టించినవారి రుణం తీర్చుకోవడానికి, ఎంతటి ప్రజాస్వామ్య వ్యతిరేక చర్యకు ఒడిగట్టాల్సివచ్చినా వెనుకాడడంలేదు. తమిళనాడు ప్రభుత్వం బర్తరఫ్, గవర్నర్ బదలీ, బీహార్ గవర్నర్ తొలగింపు వంటివన్నీ కొందరు వ్యక్తుల ప్రీత్యర్థం తీసుకున్న నిర్ణయాలే.

పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చిందన్నట్లు... ఏదీ ఏమైనప్పటికీ దేశంలో ఎప్పుడే రాష్ట్ర ప్రభుత్వం కూలిపోతుందో తెలియని అయోమయావస్థ నెలకొంటున్నది. ఇంకొకప్రక్క అసలు చంద్రశేఖర్ కాళ్ళక్రిందకే నీళ్ళు తెచ్చేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. దేవీలాల్, రాజీవ్‌గాంధీల పత్రికా ప్రకటనలు, రాజకీయ కార్యకలాపాలు, లేఖాస్త్రాలు గమనిస్తే చంద్రశేఖర్ పట్ల కాంగ్రెస్‌కు విరక్తి కల్గిందన్న అభిప్రాయం ఏర్పడుతున్నది. రాజీవ్‌గాంధీ కనుసైగ చేస్తేచాలు, కేంద్ర ప్రభుత్వం పేకమేడలాగ కుప్పకూలిపోతుంది.

ప్రపంచ వ్యాప్తంగా ప్రస్తుతమున్న ఉద్రిక్త పరిస్థితులలో ఇటువంటి అస్థిరతాభావం దేశానికి అరిష్టం క్రిందే లెక్క. గల్ఫ్ యుద్ధం ఫలితంగా దేశ ఆర్థిక పరిస్థితి చితికిపోయింది. విదేశీ మారక ద్రవ్య నిల్వలు హరించుకొని పోయాయి. దాని ఫలితంగా దిగుమతులు స్తంభించి, పలుపరిశ్రమలు మూతపడే స్థితికి చేరుకున్నాయి. ఆయిల్ కొరతతో ఇటు పారిశ్రామిక రంగం, అటు వ్యవసాయిక రంగం అత్యంత క్లిష్ట పరిస్థితి నెదుర్కొంటున్నాయి. సౌదీ అరేబియాతో చెలిమి చేసినందుకు తమదేశ ప్రజలలో పెల్లుబికిన నిరసన జ్వాలలను శాంతింప చేయడానికి- పాకిస్తాన్ నేతలు ఇండియాతో కవ్వింపుకు సమకట్టున్నారు. దేశ సరిహద్దులలో ప్రమాదం పొంచివుంది. బి జె పి వంటి పార్టీలు ఢిల్లీ పీఠంపై కన్నువేసి, దేశంలో మతతత్వ ధోరణులను రెచ్చగొడ్తున్నాయి. ప్రజలను చీల్చి, ఓట్ల రాశుల పెంచుకోవడానికి కుట్రపన్నుతున్నాయి. తీవ్రవాదుల సమస్య సరేసరి- రావణాసురుడి కాష్ఠంవలె రగులుతూనేవుంది.

ఇటువంటి క్లిష్టపరిస్థితులలో దేశంలో రాజకీయ అస్థిరత ఏర్పడడం, ప్రజలకు క్షేమంకాదు. రాజకీయవాదులు తాత్కాలికంగానైనా తమ పదవులవేటను ప్రక్కనబెట్టి, విశాల జాతీయ ప్రయోజనాల ప్రాతిపదికపైన నిర్ణయాలు తీసుకోవడం అవసరం. తప్పో, ఒప్పో, చంద్రశేఖర్ ప్రభుత్వం ఏర్పడింది. దాన్నిప్పుడు కదలించి, పడగొట్టి, మరొక మైనారిటీ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయడం తగనిపని. గల్ఫ్‌వార్ ఆగిపోయి, దేశ ఆర్థికవ్యవస్థ తిరిగి పుంజుకొనేవరకు చంద్రశేఖర్‌నే ప్రధానిగా కొనసాగనివ్వడం మంచిది. ఎన్నికలకూ ఇది సమయంకాదు. కాంగ్రెస్‌పార్టీ స్వంత ప్రయోజనాలదృష్ట్యా చూసినా ఎన్నికలకు మరికొంతకాలం వేచిచూడడమే సరైన నిర్ణయమౌతుంది. ఇప్పుడు తొందరపడి పార్లమెంట్ రద్దుకు సాహసిస్తే, దేశేతులా బిజెపి వంటి సంకుచిత దృక్పథం కల్గిన పార్టీలకు పెత్తనం అప్పచెప్పవలసివస్తుంది.

రాజీవ్‌గాంధీ అటువంటి వినాశకర పరిస్థితికి దోహదమిచ్చే నిర్ణయం తీసుకోరనే ఆశిద్దాం!

---

## జమీన్‌రైతు

14-2-1941

16 పేజీల ఆజా

### అందరికీ ఒకే క్లాసు

తిరుచునాపల్లి జైల్లో 160 మంది సత్యాగ్రహుల పిటిషన్

తిరుచునాపల్లి జైల్లో 188 మంది ఏ. బి తరగతి రాజకీయ ఖైదీలున్నారు. అందులో 160 మంది శ్రీ వి. వి. గిరి, బయ్యా సూర్యనారాయణమూర్తి, వెన్నెలకంటి రాఘవయ్య వగైరాలంతా కలసి ఈ క్రిందివిధంగా ప్రభుత్వానికి పిటీషను దాఖలు చేశారు. ''రాజకీయ ఖైదీల దరికి 'బి' క్లాసు ఇవ్వండి లేదా వాళ్ళందరిపైనా ఖర్చయ్యే డబ్బును అందరికీ సమానంగా పంపకం చేయండి''

వెన్నెలకంటి రాఘవయ్య (నెల్లూరు ప్లీడరు) గారు మాత్రం ప్రత్యేకపిటీషనులో ప్రభుత్వం పైని సూచింపబడినదానికి అంగీకరించకపోతే, తన్ను 'సి' క్లాసులోకి పంపి వేయమని వ్రాసియున్నారని తెలుస్తున్నది. ప్రస్తుతం రాఘవయ్యగారు 'ఏ' క్లాసులో నున్నారు.

### గూడూరు సత్యాగ్రహుల రాక

గూడూరు తాలూకా డిఫెన్సు చట్టం క్రింద ఖైదుచేయబడిన సత్యాగ్రహులు ఈ దినం 8 గంటలకు నెల్లూరు చేరారు. ట్రంకురోడ్డులోని కాంగ్రెస్ కార్యాలయం ఎదుట గొప్ప స్వాగతమియ్యబడినపిదప కాంగ్రెస్ కమిటీ వారు ఆల్పాహార విందొసగిరి. సంతపేట, చిన్నబజారు, పెద్దబజారుల గుండా ఊరేగింపుతో మూలపేటకు వెళ్ళారు. శ్రీ తిక్కవరపు రామిరెడ్డి

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

గారియింట మధ్యాహ్నం భోజనం, సాయంత్రం టౌనుహాలులో సభ. రాత్రి మునిసిపల్ కాంగ్రెస్ పార్టీవారి విందు. రేపు 'జమీన్ రైతు' వారి విందు ఇంకా — ఇంకా.

### నెల్లూరు ముచ్చట్లు

కరెన్సీనోట్లు దొరికినవట

3 తేదీరాత్రి కొన్ని నూరు రూపాయల నోట్లు నెల్లూరు సమీపాన హైస్కూలు రోడ్డుపైన ఒకవ్యక్తికి దొరికినట్లున్నూ, అవి ఎవరివో పత్రిక ద్వారా వివరాలు తెలిపి తీసుకొనవలసిందని ఆస్తానమని వ్రాస్తున్నారు. అవి దొరికిన వ్యక్తి అడ్రసు పత్రికావారికన్నా తెల్పడం అవసరం. నిజంగా దొరికినట్లున్న వారెవరైనా పూర్తి వివరాలు సంపూర్ణంగా 'జమీన్‌రైతు'లో ప్రకటించండి.

### మునిలాల్‌కు విందు

యన్. వెంకట్రావుగారు నెల్లూరుకు మునిలాల్‌గారు చేసిన సేవకు హార్దికమైనంగా గాలోలు మొన్న విందు చేసి దస్యులైనారట. హిందూ మహమ్మదీయుల గలాటా దీపం వెలిగించిందేనే మహానుభావా!

### డి. వల్లభరావు అరెస్ట్

ప్రముఖ రైతాంగ సేవకుడు, మందసా రక్షణకమిటీ ప్రధాన కార్యదర్శియైన డి. వల్లభరావు బి ఎ గారు 9 తేది మధ్యాహ్నం 1-గంటకు నెల్లూరుజిల్లా గూడూరులో మద్రాసు సి ఐ డి శాఖ ఇన్‌స్పెక్టరు, గూడూరు S. I. చేత మద్రాసు గవర్నమెంటు వుత్తర్వు ప్రకారం ఇండియా డిఫెన్సు ఆక్టు 26 రూలుననుసరించి అరెస్టుచేసి పోలీసు స్టేషనులో ఉంచబడి 10 తేది ఉదయం 7 గంటల బండిలో రాయవేలూరుకు డిటెన్యూగా తీసుకపోబడిరి. అరెస్టు చేయబడినప్పుడు వారు లిపి... ఉడపు, జ్వరముచేత బాధపడుతూ 4 రోజులుగా ఆహారముకూడా లేకుండా ఉండిరి. అరెస్టు సమయములో వెంటగిరి తాలూకాకు సంబంధించిన రైతు సమ్మేళన 20 పుస్తకాలు వారి నుండి పోలీసులు వశపరచుకొనిరి.

---

## టౌన్‌హాల్ ఇంకా అధ్వాన్నంగా వుంది!

నెల్లూరులోని టిటిడి కళ్యాణమండపం దురవస్థగురించి గతవారం ఒక పాఠకుడు వ్రాసింది అక్షరాలా నిజం. అయితే నెల్లూరు టౌనుహాలు దానికంటే దౌర్భాగ్య పరిస్థితిలోవుంది. కళాహృదయంతో, కళాసేవకోసం స్వర్గీయ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు కట్టించిన ఈ భూరిభవనం ఈనాడు కళాకారులనుంచి డబ్బు గుంజుకొనే వ్యాపారసంస్థగా మారిపోయింది.

సాయంకాలం ఆరుగంటలకు నాటక ప్రదర్శనవుంటే, ఐదు గంటలకుకాని హాలు స్వాధీనం చేయడంలేదు. అడిగితే అదంతేనంటున్నారు. ఆ కొద్దివ్యవధిలో స్టేజీ ఏర్పాట్లు ఎట్లా చేసుకోవాలి? సెట్టింగులు ఎట్లా కట్టుకోవాలి? మేకప్ ఎట్లా వేసుకోవాలి? సాయంకాలానికి హాలు బుక్ చేసుకున్నప్పుడు కనీసం మధ్యాహ్నం పన్నెండుగంటలకైనా అప్పచెప్పాలికదా?

హాలు నిర్వాహకులదగ్గర రెండురకాల మైకులున్నాయి ఒకటి నాసిరకం, మరొకటి మేలురకం. మొదటిదానికి బాడుగ తక్కువ. కాని, అదిపనిచేయదు, రెండవరకానికి భరించరాని బాడుగ. నాటకసంస్థ తనకుతానుగా మంచి మైకు తెప్పించుకోవడానికి వీరు ఒప్పుకోరు. వీరికి మైకుసెట్టు బాడుగ చెల్లించి, బయటనుంచి వేరే తెప్పుకోవాలంట. నాటకాలు వేసేవారు ఈ అదనపుఖర్చు భరించగలరా?

గ్రీన్ రూంలో మేకప్ వేసుకొనేవారు కూర్చునేందుకు కుర్చీకూడాలేదు. లైట్లు సరిగా వెలగడంలేదు. స్టేజీమీదకూడా లైటింగ్ సరిగాలేదు. హాలు సిబ్బందితో ఏదైనా ప్లాబ్లమ్ ఐనా పైసలడుగుతున్నారు. నాటక సమాజాలకు కనీస మాత్ర గౌరవంకూడా ఇవ్వడంలేదు.

స్థాపకుల కళాతృష్ణను గుర్తుతెచ్చుకొని అయినా, ప్రస్తుత నిర్వాహకులు కళాకారులు పడుతున్న ఇబ్బందులు తొలగించాలని మనవి.

—ఒక నాటక సమాజం.

### యూత్ కాంగ్రెస్ - మాబాధ అర్థంచేసుకోండి!

గతవారం జమీన్‌రైతులో యూత్‌కాంగ్రెస్‌పై మీరు వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఏకీభవించలేకపోతున్నాను. ఇది విమర్శకాదు జమీన్‌రైతును విమర్శించే స్థాయి నాకులేదు. దయచేసి దీనిని అభిప్రాయభేదంగా మాత్రమే స్వీకరించండి.



యూత్ కాంగ్రెస్ నాయకులకు యువకులను సమీకరించే సంకల్పం లేదు. కాంగ్రెస్ బలాన్ని పెంచే సమర్థత లేదు అని వ్యాఖ్యానించారు. దీనితో నేను ఏకీభవించడంలేదు. యూత్ కాంగ్రెస్ కో సం మేము అనేక ఆందోళనలు చేశాం. ఇటీవల నెల్లూరు గుడిసెల తొలగింపుపై తొలుత ఆందోళన చేపట్టింది మేమే. విద్యార్థుల స్కాలర్‌షిప్‌లకోసం ఆమరణ నిరాహార దీక్షలు, ధర్నాలు, రాస్తారోకోలు చేశాం; రైల్వేట్రాక్ ప్రక్కన వున్న గుడిసెల తొలగింపుకు వ్యతిరేకంగా పని

—తరువాత 7 పేజీలో

---

# పద్నాలుగేళ్ళ తర్వాత పుట్టింటికి తిరిగివచ్చిన 'చరిత్ర'!

అలనాడు శ్రీరామచంద్రుడు పద్నాలుగేళ్ళ అరణ్యవాసం తర్వాత అయోధ్యలో ప్రవేశించినట్లే, అలనాడు ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ పద్నాలుగేళ్ళ ఆంధ్రదేశ సంచారం పర్యాంతం పుట్టినగడ్డ మీద కాలుమోపింది. ఒకవిధంగా ఇది చరిత్రాత్మక సంఘటనే!

ఈ నెల 9, 10 తేదీలలో నెల్లూరు శ్రీ సర్వోదయ కాలేజీ ఆధ్వర్యంలో చారిత్రక కలశంగా, పరిశోధక తిరునాళ్ళగా జరిగిన ఆం. ప్ర. హిస్టరీ కాంగ్రెస్ పదిహేనవ వార్షిక సదస్సుల్ని చాలామంది తెలుగు "హోమ్ కమింగ్"గా, పుట్టినిల్లు చేరడంగా వర్ణించారు. నిజమే! హిస్టరీ కాంగ్రెస్ ఎక్కడో కాదు. మన కావలి జవహర్ భారతిలోనే 1976 మే 1, 2 తేదీలలో ఊపిరిపోసుకుంది. ఆనాటినుండి ప్రతి ఏడూ క్రమం తప్పకుండా వివిధ ప్రాంతాలలో ఈ 'చరిత్ర క్రతువు' జరుగుతూనేవుంది. నెల్లూరులో వి. ఆర్ కాలేజీ వంటి వృద్ధులుండుకాలు, మహా వృక్షాలు వున్నా ఏమిలాభం? హిస్టరీ కాంగ్రెసుకు ఆతిథ్యమిచ్చి, సదస్సుకు వేదికవడంలోనే మేధోచింతన వారితలలకు ఎక్కితేగా? తదుపరి సర్వోదయ కాలేజీ వంటి చిన్నకాలేజీ పూనుకొని, ఈ బాధ్యతను మోసి, హిస్టరీ కాంగ్రెసును పుట్టినింటికి తీసుకొచ్చింది.

రెండురోజులు సర్వోదయ కాలేజీ ఆవరణం దాదాపు 200 మంది పరిశోధకులతో కళకళలాడింది. తొలిరోజు సదస్సును నెల్లూరీయుడైన ఆం. ప్ర. హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ పాటూరు వెంకట్రామరెడ్డి ప్రారంభించారు. ఢిల్లీకి చెందిన నెహ్రూ లైబ్రరీ, మ్యూజియం డైరెక్టర్ ప్రసిద్ధ చరిత్రకారుడు డాక్టర్ రవీంద్ర కుమార్ సభనుద్దేశించారు. సుప్రసిద్ధ చరిత్రకారుడు స్వర్గీయ మల్లంపల్లి సోమశేఖరశర్మ చిత్రపటాన్ని తెలుగుగంగ స్పెషల్ కలెక్టర్ శ్రీ సుందరకుమార్ ఆవిష్కరించారు; ఆర్కైవ్స్ ఎగ్జిబిషను ఎమ్మెల్యే జెకె రెడ్డి, ఆర్కియాలజీ ఎగ్జిబిషను ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్ అధ్యక్షులు ప్రొఫెసర్ హీరాలాల్‌గుప్త ప్రారంభించారు. మన నెల్లూరు పరిశోధక పితామహుడు శ్రీ నేలనూతల కృష్ణమూర్తిని ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ యడ్లపల్లి గోపాలరెడ్డి 'ప్రత్యేకశైలి'లో సన్మానించారు.

> **జిల్లాకుచెందిన చరిత్రాధ్యాపకులు పట్టించుకోక పోయినా ఆం. ప్ర. చరిత్ర సదస్సు విజ్ఞానదాయకంగా జరిగింది!**

జస్టిస్ పి. వెంకట్రామరెడ్డి చరిత్రకారుడు కాకపోయినా చరిత్ర పరిశోధన ఏ దృక్పథంతో, ఏ లక్ష్యంతో ఏ నిబద్ధతతో జరగాలో చక్కగా వివరించారు. పరిశోధన పుక్కిటి పురాణంగా కాకుండా, జాతి సమైక్యతకు, సమాజ పురోగతికి దోహదం కల్గించాలని; ఇతిహాసపు చీకటి కోణాలలో దాగిన రహస్యాలను వెలికితీయాలని; మనుషుల మధ్య అడ్డుగోడలు తొలగించే విధంగా వుండాలని ఆయన అన్నారు.

హైదరాబాద్‌లో, ఇతర ప్రదేశాలలో జరిగిన మతకలహాల వెనుకవున్న చారిత్రక కారణాలనుపరిశోధించాల్సిన అవసరం ఎంతైనా వుందని, సామాజిక దృక్పథంతో జరిగే చరిత్ర పరిశోధనల్ని ప్రచురించేందుకు ప్రభుత్వం సహకరించాలని శ్రీ వెంకట్రామరెడ్డి అభిలాషించారు.

ప్రారంభ సభానంతరం చరిత్ర సదస్సులు మొదలైనాయి. ప్రాచ్య, మధ్య, ఆధునిక యుగాలు, స్థానిక చరిత్ర, చారిత్రక శాస్త్రం, విభాగాలుగా ప్రతినిధులు విడిపోయి, చర్చలు సాగించారు. రెండు రోజుల్లో మొత్తం 80 పరిశోధక వ్యాసాలు ముగ్గుకొచ్చాయి. చరిత్ర లోతుపాతుల్ని తరచిచూశాయి ముఖ్యంగా ఆధునిక చరిత్ర సదస్సు ఆసక్తికరంగా జరిగింది. మరో విశేషమేమిటంటే, జాతీయస్థాయిలో ప్రసిద్ధులైన చరిత్రకారులు ప్రొఫెసర్ హీరాలాల్‌గుప్త, ప్రొఫెసర్ హర్బన్స్ ముఖియా లాంటివారు ఈ సదస్సుల్లో పాల్గొని ప్రతివ్యాసంమీద సమగ్రంగా చర్చించారు. యువ పరిశోధకులకు సలహాలిచ్చారు. హైదరాబాదు సెంట్రల్ యూనివర్శిటీ చరిత్రాచార్యుడు, ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి, జవహర్ భారతి మాజీ ప్రిన్సిపాల్ వి. రామకృష్ణ

—తరువాయి 11 వ పేజీలో

## గ్రంథసమీక్ష

[ప్రాచీన భగవద్గీత — ప్రచురణ: శ్రీ అనుభవానంద గ్రంథమాల, రథం బజారు రోడ్డు, బాపట్ల-622 101 వెల: రు. 10-00 లు.]

హిందువులకు పవిత్ర గ్రంథము భగవద్గీత. శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించిన కర్మ, భక్తి, జ్ఞానములే భగవద్గీతకు ముఖ్యాంశములు. భగవద్గీతలో 18 అధ్యాయములు. 700 శ్లోకములు కలవు. ఈ 700 శ్లోకములకే వ్యాఖ్యలు కలవు. శ్రీ ఆదిశంకరులు కూడా 700 శ్లోకములకే భాష్యమును వ్రాసిరి. కాని గోండాల్ రసశాల ఔషధాశ్రమము వారిచే సేకరించబడిన తాళపత్ర లిఖిత ప్రతిలో 745 శ్లోకము లున్నవి. శ్రీ ఆదిశంకరులు కూడా ఈ 45 శ్లోకములను ప్రస్తావించలేదు.

గోండాల్ నివాసియు రాజవైద్యుడు శ్రీ జీ. కె. శాస్త్రి 17000 వ్రాతప్రతులను పరిశీలించెను. 1889 లో తాళపత్రములపై వ్రాయబడిన 745 శ్లోకముల భగవద్గీతను చూచి ఎంతగానో సంతోషించెను. 1962 లో 'ప్రాచీన భగవద్గీత' అను పేరుతో ముద్రితమైనది 'షట్శతాని సంశతాని శ్లోకానాం ప్రాహకేశవః అర్జునః

—తరువాయి 11 వ పేజీలో

ఇటీవల టౌన్‌హాలులో జరిగిన సమత వాలంటరీ బ్లడ్‌డోనార్స్ అసోసియేషన్ వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తున్న డి. ఎస్. పి. బి. బాలకృష్ణ చిత్రంలో వి. రవీంద్రబాబు, దేవరాజ్, ఎం.ఆర్.టి. శ్రీహరిదాసు, పి. సి. రెడ్డి తదితరులున్నారు



### మునిసిపల్ అధికారులు లంచాలు మేసి మౌనంవహిస్తే-

# పౌరులు కంకరరాళ్ళకాలుష్యానికి క్షయ వ్యాధిగ్రస్తులౌతున్నారు!

నెల్లూరు మునిసిపల్ అధికారుల పాలనలో ఎట్లా చెలామణి అవుతుందో చూడాలంటే, దర్గామిట్ట ఎం. టి. బ్రదర్స్ వర్క్‌షాప్ వెనక్కుపోయి చూడండి. వ్యాపారులు విసిరిపారేసే లంచాల ఎంగిలిమెతుకులు ఏరుక తిన్నందుకు ప్రతిఫలంగా, వందలాది పౌరుల ఊపిరితిత్తులను 'క్షయ'కు గురిచేసే దారుణాన్ని కళ్ళారా తిలకించండి!

ఎం. టి. బ్రదర్స్ వర్క్‌షాప్ వెనుక టి. బి. ఆస్పత్రి ఆవరణాన్ని ఆనుకొని విశాలమైన ఖాళీస్థలం వుంది. ఆ స్థలాన్ని కంకరరాళ్ళు అమ్మే వ్యాపారస్తులు కొందరు ఆక్రమించారు. ఎక్కడెక్కడి నుంచో లారీలకులారీల కంకర తెచ్చి, అక్కడ గుట్టపోసి అమ్ముతున్నారు. అదంతా ప్రైవేటు స్థలం. మూడువైపుల ఇళ్ళు, ఒకవైపు ఆస్పత్రి వున్నాయి. ఒక్కొక్కలారీవచ్చి కంకర క్రుమ్మరించేటప్పుడల్లా తెల్లని, సన్నని దుమ్ము ఇసుక తుఫాను మాదిరి లేస్తున్నది. వరుసగా నాలుగైదు లారీలువస్తే ఆ ప్రాంతమంతా పొగమబ్బులు క్రమ్మినట్లే వుంటుంది. ఇరాక్ పెట్రోలు బావుల దగ్గంవల్ల ఆకాశంలో ఆమ్లవాన కురిసినట్లు, ఈ ఖాళీస్థలంలో లేచినదుమ్మంతా ఇటు ఇళ్ళపైన, అటు టి. బి. ఆస్పత్రి రోగులపైన దండయాత్ర చేస్తున్నది. కిటికీలు, తలుపులు బిగించి కూర్చున్నా, ఇళ్ళలోకి దూరి ఊపిరాడకుండా చేస్తున్నదది.

ఒకరోజా, రెండురోజులుకాదు, నెలల తరబడి ఈ భయంకర వాతావరణ కాలుష్యాన్ని నిస్సహాయంగా అనుభవిస్తు ఎడం వల్ల, ఆ చుట్టుప్రక్కల కాపురాలుండేవారు టి. బి. వంటి ప్రాణాంతక వ్యాధులకు గురౌతున్నారు. ఊపిరితిత్తులలో దుమ్ముచేరి నానాయాతనలు పడుతున్నారు. చిన్న పిల్లలలో ఆస్మావంటి జబ్బులు సంక్రమిస్తున్నాయి. టీవిలు, టేప్‌రికార్డర్ల వంటి

## సింహపురి

సున్నితమైన ఎలక్ట్రానిక్ పరికరాలు ఎందుకూపనికిరాకుండాపోతున్నాయి. టిబి ఆస్పత్రిలో రోగులు పడుకున్న వార్డుల చెప్పనలవికావు గాలి వెలుతురు ధారాళంగా రావడానికి వార్డులకు విశాలమైన కిటికీలు పెట్టకంవల్ల దుమ్ము యథేచ్ఛగా లోపలికి వస్తున్నది మందు, మాకలనుసైతం పాడు చేస్తున్నది.

ఇంతమందిని ఇన్నిరకాలుగా యాతన పెడుతున్న ఈ కంకర వ్యాపారాన్ని ఇక్కడినుంచి తరలింపచేయమని స్థానికులు ఎంత ప్రయత్నంచేసినా ఫలించడం లేదట ఎట్లా ఫలిస్తుంది? లారీ ట్రిప్పుకు వందరూపాయల లెక్కన లంచంపుచ్చుకొని గమ్ముగా అధికారులు తమకళ్ళెదుట జరుగుతున్న ఈ చట్టవ్యతిరేక కార్యకలాపాన్ని చూసీచూడనట్లు వదిలేస్తున్నారు. నెలమామూళ్ళు గుంజుకొని శానిటరీ ఇన్స్పెక్టర్లు అసలిది తమకళ్ళకు కన్పడనే కన్పడడంలేదన్నట్లు వ్యవహరిస్తున్నారు. వాహనతనిఖీల్లో పడుతున్న పచ్చనోట్లను చూసుకొని మురిసిపోతున్నారే తప్ప, తమ పాపంకారణంగా పౌరులు ఎంతటి దుర్భరపరిస్థితులలో కాపురాలు చేయవలసివస్తున్నదో అర్థం చేసుకోవడం లేదు.

ఇదివరకు ఇదేకంకరను సోమశిల గెస్ట్ హౌస్ ప్రాంతంలో క్రుమ్మరించేవారు.

—తరువాయి 8 పేజీలో



నెల్లూరు ... జయంత్యుత్సవాలలో రిటైర్డ్ కల్లూరి కె.పి. నారాయణరావు, జె.వి. సుబ్బరాయుడు, బెజవాడ గోపాలరెడ్డి, ఆర్. అనంతపద్మనాభరావు, వి. కోటేశ్వరమ్మ, పి. వి. రంగనాథరెడ్డి

## శెబాష్

(మొదటి పేజీ తరువాయి)

ప్రతిపక్షాలకుకూడా ఇదొక పజిల్ లాగానే కన్పిస్తున్నది. అందువల్లే వారు తమ నిత్య ప్రతిక్రియాపటంలో ప్రభుత్వాన్ని, ప్రభుత్వ విధానాలను విమర్శించడానికి మాటలు వెతుక్కోవలసివస్తున్నది.

దినపత్రికావిలేఖరుల పరిస్థితి అయితే, చెప్పనే అవసరంలేదు ఎన్. టి. ఆర్. చెన్నారెడ్డిల హయాంలో వాటికి వార్తలు కోకొల్లలుగా దొరికేవి. ఇప్పుడు వార్తా కరువు తాండవిస్తున్నది జనార్ధనరెడ్డి తానుగా ఏదీ మాట్లాడటంలేదు. తన మంత్రులనూ మాట్లాడనివ్వడంలేదు. మంత్రివర్గ విస్తరణ పెండింగ్ లో వున్నందువల్ల అసమ్మతిపక్షం వహించే కాంగ్రెస్ నాయకులు సైతం ఏమిమాట్లాడితే ఏమితప్పో అన్నట్లు పెదవులు కుట్టేసుకొని కాలక్షేపం చేస్తున్నారు. విలేఖరులు ఏ పార్టీ నాయకుడి దగ్గరకుపోయినా- కబుర్లుచెప్పి, కాఫీఇచ్చి పంపిస్తున్నారు



ఎం. ఎస్. రెడ్డి, సి. నారాయణరెడ్డి, ఉ డేం మాలకొండారెడ్డి తదితర ప్రముఖుల ఆశీర్వాదంతో హైద్రాబాద్ ఈడెన్ గార్డెన్స్‌లో వైభవంగా వివాహం జరిగిన దంపతులు వైపాడు, ఎన్. కోదండరామరెడ్డిగారి కుమారుడు డా॥ విష్ణుస్వరూప్ MS ఎక్సైజ్ డెప్యూటీ కమిషనర్ వి. పీరారెడ్డిగారి కుమార్తె డా॥ శాంతి



## 'ధర్మ' దర్శనం

ప్రజా సమస్యల్ని స్వయంగా తెలుసుకునేందుకు ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి ప్రతిరోజూ ఉదయం 8 గంటలకు ఆయన నివాసంలో సందర్శకులను కలుసుకుంటున్నారు శ్రీ ఎన్. టి. రామారావు హయాంలోకూడా ఈ విధమైన ఏర్పాటు ఉన్నప్పటికీ ఆయన నేరుగా కలుసుకోకుండా సందర్శకులందర్నీ ఉద్దేశించి చేర్తో పన్యాసంచేసి వెళ్ళిపోయేవారు. ఆయన అంతరంగికసిబ్బంది అర్జీలుతీసుకునేవారు. డాక్టర్ చెన్నారెడ్డి హయాంలో ముఖ్యమంత్రి సందర్శన భాగ్యం గగన కుసుమంగా ఉండేది ఎమ్మెల్యేలు, ఎంపీలకే ముఖ్యమంత్రిదర్శనం లభించేదికాదు. కానీ జనార్ధన్‌రెడ్డి ప్రతిరోజూ తనను చూసేందుకు వచ్చిన వారిని వ్యక్తిగతంగా పలుకరిస్తూ, సమస్యలేమైనా వుంటే స్వయంగా విని, అక్కడికక్కడే అధికారులను పిలిచి సమస్య పరిష్కారానికి కృషిచేస్తున్నారు. అందుకే ముఖ్యమంత్రి 'ధర్మ' దర్శనానికి గుంపులు గుంపులుగా జనంతరలివస్తున్నారు వచ్చేవాళ్ళలో బీదాబిక్కి, బడుగువర్గాల సంఖ్య ఎక్కువగా వుంటోంది. అలాగే ప్రజాప్రతినిధులైన ఎమ్మెల్యేలు, ఎంపీలను కూడా తరచూ కలుసుకుంటూ, వారి నియోజకవర్గ సమస్యల్ని తెలుసుకొని, పరిష్కారానికి కృషిచేస్తు తదంవల్ల ముఖ్యమంత్రి ఒక మంచి సాంప్రదాయానికి నాంది పలికారని పలువురు భావిస్తున్నారు. ☆

## జనవాణి

(8 వ పేజీ తరువాయి)

దేశం. తెలుగుదేశం పాలనలో వారి గూండాయిజాన్ని ఎదుర్కొన్నందుకు మాపై ఎన్నో అక్రమకేసులు బనాయించారు. నాపై రౌడీషీట్ ఓపెన్‌చేశారు. ఈరోజుకికూడా 5 టౌన్ పోలీస్ స్టేషన్‌లో అది అలాగా వుంది కోర్టులచుట్టూ కేసుల విరామంకోసం తిరుగుతున్నాం.

ప్రతికాంగ్రెస్ కార్యక్రమానికీ స్థాయిని బట్టి మేము యువకులను సమీకరిస్తూనే వున్నాం వాస్తవాలు ఇట్లావుండే. ఈరోజు పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత నిజమైన కార్యకర్తలకు గుర్తింపు లభించిందా? తెలుగుదేశం పాలనలో జిల్లాలో పెత్తనం సాగించినవారే నేడు కాంగ్రెస్‌లో అజమాయిషీ చలాయిస్తున్నారు

ముఖ్యమంత్రి ఆరోజు చార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో తిరిగి వెళ్ళనున్నారని నాకు తెలియదు. సభా ప్రారంభంలోకూడా ఎవ్వరూ వ్యవధిలేదని చెప్పలేదు కాంగ్రెస్‌లోని వాస్తవ స్థితులు చెప్పడానికి నాకు అవకాశం ఇవ్వమని మాత్రమే నేను అడిగాను.

ఈ పరిస్థితులలో ఏవేవో రైతులో వార్త రావడం మమ్మల్ని మరీ బాధించింది మా ఆవేదనను అర్థం చేసుకోండి

నెల్లూరు —కె. శ్రీధర్‌రెడ్డి
మాజీ ప్రధాన కార్యదర్శి,
రాష్ట్ర యూత్‌కాంగ్రెస్.

## విద్యుత్ ఉద్యోగ నాయకులకు అభినందన

ఏ పి ఎస్ ఇ బి కి చెందిన ఉద్యోగుల చిరకాల కోర్కె, యాజమాన్యంతో ఒప్పందం కుదిర్చి, ఉద్యోగులకు ఎనలేని సేవచేసిన నెం. 1104 యూనియన్ నాయకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. బోర్డు ఆదినుంచి నిర్విరామంగా పోరాడి వీరు సాధించిన ఈ విజయంవల్ల లక్షమందికి పైగా ఉద్యోగులకు మేలుకల్గింది. రిటైర్ కాబోతున్న ఉద్యోగులకైతే 40 వేల అదనపు పెన్షన్, గ్రాట్యుటీ వచ్చే అవకాశంవుంది. ఉద్యోగుల తరఫున యూనియన్ నాయకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెల్పుతున్నాను.

నెల్లూరు —రమణయ్య

## నెల్లూరు ముచ్చట్లు

(8 వ పేజీ తరువాయి)

బాయిలర్స్ శ్రీ ఎ.పున్నారావు ఈవిషయం తెలియజేస్తున్నారు.

## ప్రమాదంలో యువకుడి చావు

నెల్లూరు సౌత్ స్టేషన్ అండర్ బ్రిడ్జి క్రింద 13 తేది అర్ధరాత్రి జరిగిన ఒక ప్రమాదంలో విజయశేఖర్‌రెడ్డి అనే డిగ్రీ చదువుతున్న విద్యార్థి దుర్మరణం పాలైనాడు సెకండ్‌షోసినిమాకువెళ్ళి, మోటార్ సైకిల్‌లో తిరిగి వస్తుండివాడట. వెనుక నుంచి లారీవచ్చిగుద్దింది అతను అక్కడికక్కడే చనిపోయాడు. అదే మోటార్ సైకిల్‌పై వుండిన ప్రభుత్వ ప్లీడరు శ్రీ సి సుందరరామరెడ్డి కుమారుడు మాత్రం ప్రమాదకర గాయాలతో మద్రాసు ఆస్పత్రిలో చికిత్సపొందుతున్నాడు.

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు 9672 (పాతవి) | | 2500.00 |
| ,, | క్రొత్తవి | 1800.00 |
| ,, | 9674 | 2600.00 |
| 6866 | | 1900.00 |
| 18969 (మొలకొలుకులు) | | 1760.00 |
| మొలగొలుకు బియ్యం (70 కి) | | 800.00 |

# శుభాభినందనలు



విజయవంతమైన హిందీ, తెలుగు భాషాచిత్రాల నిర్మాతగా ప్రసిద్ధుడు, మా మిత్రుడు

## డాక్టర్ యం. తిరుపతిరెడ్డి ఎం. బి., బి. ఎస్.,

తన మిత్రులను, శ్రేయోభిలాషులను సినిమా నిర్మాణం, పంపిణీ రంగం, ఫైనాన్స్ వ్యాపారాలలో
భాగస్వాములనుచేస్తూ, తమ పెట్టుబడికి మంచి లాభాలనార్జించిపెట్టే

# సంయుక్త ఫిలిమ్స్ లిమిటెడ్

సంస్థను స్థాపించి సహకరిస్తున్నందుకు నా శుభాభినందనలు తెలుపుతున్నాను.

టి. రమేష్‌రెడ్డి
ఛైర్మెన్, నెల్లూరు మునిసిపాలిటీ.

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, - Nellore